కం॥ వాయుతనూజుడు గావున
వాయువ్యాస్త్రంబు తృణమువలె కడచనగా
నాయెడ రౌద్రాస్త్రంబును
వేయగ నది చనియె రుద్రవీర్యుండగుటన్. 42

గీ॥ అసురు డడిగని యెంతయు నాగ్రహమ్ము
జెంది బ్రహ్మాస్త్రమునుస్వైప జి త్తమందు
బ్రహ్మమంత్రము జపియింప బ్రాణహాని
కాక బందీకృతుండయ్యె గపివరుండు. 43

ఆ॥వె॥ దనుజవర్యులతని త్రాళ్ళచే బిగియించి
పట్టితెచ్చి రాజుసజ్జ నిలుప
నధిపుడాగ్రహమ్ముగ హనుమంతు నదలించి
పలికెనిట్లు రోషభాషణముల. 44

శా॥ ఓరీవానర, దుర్మదాంధ యిటుమా యుద్యానవనమ్ముం చేరి బల్
క్రూరప్రక్రియ వృక్షముల్ విరిచి రక్షోవర్గమున్ ద్రుంచి, నీ
వీరీతిన్ జరియించి నాడవుర, నీవెవ్వండ విట్లంపి రె
వ్వారో తెల్పుము తెల్పకున్న నిపుడే ప్రాణంబులన్ దీసెదన్. 45

కం॥ అని పల్కిన వినినట్లుగ
హనుమంతుడు తోకపెంచి యాననిపంచెన్
ఘనతరమగు పీఠంబై
యెనయుగ గూర్చుండి యతని కిట్లనితెలిపెన్. 46

కం॥ నేనే రాముని బంటును
జానకి క్షేమంబు సరసి సందేశమున నిన్
గాన దలంచి యేనీగతి
దానవులన్ గూల్చినాడ దర్పమెలర్పన్. 47

కం॥ నాకంపు మేపటి యాటు
రా కోట్లకొలది వనచరావళి తోడఁ
కాకుత్స్థు డిటకు వచ్చును
నీకంతమ్మును ద్రుంచు నిక్కము సుమ్మీ. 48

గీ॥ జానకీదేవి నిప్పుడైన స్వామికిచ్చి
శరణు వేడుము మన్నించు శాంతమూర్తి
కాదనుచు తెగనీల్గిన కడకుదైత్య
వంశనాశన మగుదాక వదలబోడు. 49

కం॥ అని దర్పోన్నతి బలికిన
దనుజేంద్రుడు భటులఁజూచి చెడమక యాకో
తిని బట్టిచంపి తినుడని
యనఁగ విభీషణుడుగాంచి యతివినయమునన్ 50

ఆ॥వె॥ అగ్రజన్మ యింతయాగ్రహ మెందుకు
శాంతిబొందు మితని జంపరాదు.
దూతలధిపునాజ్ఞ దూషించి పల్కుట
తప్పుగాదు రాజధర్మ మరయ 51

కం॥ కావున ప్రాణము దీయక
యీవానరు విడుము తప్పు నిదిగాకున్నన్
యేవిధమైన దండన
గావింపుము రాజనీతి కనుగొను మన్నా. 52

ఆ॥వె॥ ఇదియె మంచిదిప్పు డీకోతితోకను
కాల్చివిడుపుడంచు కౌతుకమున
నధిపుడాజ్ఞ సేయ నందరు హనుమంతు
ద్రాళ్ళతో బిగించి దర్పమెసగ 53

గీ॥ చిక్కెరా వానరుడు మనచేతికంచు
వీధివీధిని ద్రిప్పుచు వేడ్కమీర
తైలమున వస్త్రములుముంచి వాలమునకు
జుట్టియగ్ని దగిల్చిరి సురిక్కుమనుచు. 54

ఆ॥వె॥ ఇంతవరకు నాతడేమియు బలుకక
అదరుబెదరు జెందినట్టులుండి
మొగసి హుంకరించి యుల్లిల్లు గాల్చుచు
మది బఠించె నగ్నిమంత్రములను. 55

కం॥ అదిగని యెంతటి సంకట
మొదవెను గురుమతికటంచు సుగ్రీవజయు నె
మ్మది నగ్నిదేవు రాముని
సదమల మతిదలచ నగ్నిచల్లగ నయ్యెన్. 56

కం॥ అంతట హనుమంతుడు పుర
మంతయు గలయంగ దిరిగి యతిఘోరముగన్
గంతులు వేయుచు దనుజుల
స్వాంతములు కలంగునట్లు చరియింపంగన్. 57

సీ॥ ఈకోతి నిటుబట్టి యింగలం బంటించి
యెంతజేసిరటంచు నేడ్చువారు
తల్లులు తమతమ పిల్లలగానక
వీధివీధినిదారి వెదకువారు
తమతమ వస్తుసంతతి దెచ్చుకొనబోయి
మంటలలోజిక్కి మ్రగ్గువారు
పశుబందు లగ్నిలో కుములుచుండుట జూచి
యెదమోదుకొనుచు దుఃఖించువారు

దేవదేవుని భార్యనుదెచ్చి యిట్టు
లధిపు డెంతటిపనిజేసె ననెడివారు
వస్త్రములుగాలి నటుగెత్తువారు గలిగి
మిగుల హాహానినాదముల్ మిన్నుముట్టె. 58

కం॥ హనుమంతుం డా విమ్మట
తనతోకను సలిలమందు నడిపి ధరిత్రీ
తనయ కడకేగి తనవిధ
మును సర్వస్వంబు దెలిపి ముదమారంగన్. 59

కం॥ తల్లీ శ్రీరఘురాముల
కుల్లాసముతోడ నంతయును దెల్పి వడిన్
యెల్లరము కదలివత్తుము
చల్లగ సెలవిమ్మనాకు చనియెద ననగన్. 60

గీ॥ జానకీదేవి సమ్మదస్వాంత యగుచు
సేమముగ బోయిరమ్మని సెలవొసంగ
వాయువేగముతో వేగి వార్ధిదాటి
వానరావళి కడవ్రాలి వాయుసుతుడు 61

కం॥ కనుగొంటిని జానకిని
తనవిధమంతయును సమ్మదమ్మున దెలుపన్
వనచరులు కార్యసిద్ధుని
గనగల్గితిమంచు నెరిగి గంతులువైవన్. 62

ఆ॥వె॥ జాంబవంతుడంత సంతోషితాత్ముడై
ఇంక జాగుసేయనేల మనకు
శీఘ్రముగను ప్రభువుచెంత కేగుదమంచు
పయనమొనరజేయ బలికినంత. 63

గీ॥ అందరు ప్రయాణమైపోయి యతిరయమున
మధువనమున ప్రవేశించి, మధువుగ్రోలి
ఫలములందరు భక్షించి భయములేక
నందు విహరింప సుగ్రీవు డాగ్రహించి 64

కం॥ ఇది నా వనమని యెంతయు
మదినెన్నక యింతగర్వమత్తులై యిటులన్
గ దిసిరిక వీరినిప్పుడె
మదమడచెద నింతసేని మన్నన గొనకన్. 65

కం॥ అనిరోషమ్మున బలికిన
కనుగొని యా లక్ష్మణుండు కపివర యిటులన్
వనచరులు మెలగుచున్నగ
మనపని సాధించినట్లు మనమున దోచెన్. 66

చ॥ అనవిని శాంతమొంది ప్లవగాధిపు డాకపివీరు లందరిన్
జనుమన రాఘవేశ్వరుని సన్నిధికిన్ బిలిపించి నంతటన్
మనుకొని వాయునందనుడు మ్రొక్కి శిరోమణినిచ్చి జానకిన్
గనుగొని తల్లియుండి యిదిగైకొని వచ్చితినంచు చెప్పినన్. 67

గీ॥ అవనిజాత శిరోమణి నభిప్రపొంది
కన్నులారగ జానకిన్ గాంచినట్లు
దలచి కన్గవలం దశ్రుధార రొలుక
నరయుచుండగ హనుమంతు డాత్మనలరి 68

కం॥ స్వామి మీ యానతి గొని
మేమందర మడవులందు మిన్నక యెంతో
నీమమ్మున వెదకుచు జని
యేమేమియొ గష్టపాటు లెనసితి మనుచున్. 69

ఆ॥ వె॥ పూసగ్రుచ్చినట్లు పొలుపార బోయిన
పోకడలను జెప్పి పురవరంబు
గాల్చి జనకసుతను కనుగొన్న సంగతి
విశదముగను జెప్పె వేడ్కమీర. 70

కం॥ అంతట శ్రీరాముడు హను
మంతునిగని నీవు తిరిగి మరలెడి వేళన్
కాంతామణి యేమనిమెను
స్వాంతమ్మున వినగ గోర్కె జనియించె ననన్. 71

గీ॥ స్వామి కథలేని నాథుల పదినెలలుగ
గడిపితిని రెండు మాసముల్ గడచెనేని
నన్ను వెగటాత్ముని దైవనాథుడనిమె
గాన త్వరలోన యిటజేర గడగుడనిమె. 72

గీ॥ చిత్రకూటమునందొక్క చెనటికాకి
నన్ను బొడిచిన దౌర్భాగ్యుని నాథు డిప్పు
డింప దుష్టునిచేత నే నిడుములొంద
మది సహింపనె యెట్లక మానుప ననియె. 73

చ॥ అని వచియించినంత మహితాత్ముడు రాముడు లక్ష్మణార్యజుల్
వినవినమంచనమున్ విని సెబాసు భళీ యని యాంజనేయునిన్
ఘనముగ మెచ్చి వాక్ష్యమను గాలియుగాక మరెవ్వరేనియున్
వనధి దాటనోపునె వైరులపట్నము గాల్చివత్తురే. 74

కం॥ అని యెంతయు మోదమ్మున
హనుమంతుని కౌగలించె యా రఘురాముం
డనఘాత్మ చిరంజీవిగ
మనగలవని యాంజనేయు హస్తము నిమిరెన్. 75

గీ॥ ఇంక జేడయగరాదని యెంచుచుండు
సర్వ వానరులనుబిల్చి సమరమునకు
సిద్ధమైయుండుమ టాజ్ఞ జేసినంత
పౌరికటాటోపమున మించె ప్లవగ బలము. 76

ఉ॥ ఎక్కడజూచినన్ మది గణింపగ సాధ్యముగాక యెంతయున్
మిక్కుటమైన యార్భటిని మేదిని కంపము జెందునట్లుగా
దిక్కులు పిక్కటిల్ల జనుదెంచి కపీశ్వర యేమియాజ్ఞ యం
చక్కపి సేనలెల్ల వినయమ్మున జారులుదీరి నిల్వగన్. 77

కం॥ కపిసేనలార యిప్పుడె
నృపవర్యుడు మెచ్చునట్లు నేర్పుజెలంగన్
విపులముగ రావణుని పై
నిపుడే దండెత్తుడంచు నినుడు తనగన్. 76

సీ॥ ఏ నొక్కడనెజాలు దానవేంద్రుని దుంప
నరయుమంచు దటంచు ననెడివారు
ఫెల్లున నుగ్రులై పెడబొబ్బలిడుచును
వీరులై గంతులు వేయువారు
ఇపుడె రావణుబట్టి యీడ్చి తెచ్చెదమంచు
ప్రభువుతో ప్రజ్ఞలు బలుకువారు
పండ్లకొమ్మలు చేతబట్టి యొక్కొక్కపండు
నమలుచు వేడ్కతో నడచువారు

అమిత పదఘట్టనలచేత నరుగువారు
నగుచు గంభీరముగ నట్టహాసమెసగ
వీరగర్జనము లొనర్చి విక్రమించి
దక్షిణాభిముఖంబుగా దండువెడలె. 79

గీ॥ ఇట్లు బయనించి యందందు హితము లైన
కొలకులను నీరుద్రావుచు కొండలందు
నెసగుఫలముల దృప్తి భక్షించుకొనుచు
కదిమి మీర మహేంద్రాద్రి కడకు జేరి.

ఉ॥ ఆగిరిమెక్కి దాశరథి యంబుధియగ్గర గానుపింప నీ
సాగరమెట్టు దాటనగు సాధ్యముగాదని యెల్లరచ్చటన్
ఆగమనంబొనర్చి తన యాత్మజులో వగినట్టి మోచనల్
దాగగ జేయుచుండ సుర వైరిపరేణ్యుడు జూచె నిందరి

ఆ॥ వె॥ అంత మంత్రివరుల నచటికి రప్పించి
వానరుండొకండు వచ్చి యిట్లు
సీతవార్త నరసి పెలరేగి రాముని
దండు విడియజేసె దర్పమెసగ.

చ॥ అని యిటు బల్కినం ద్రదనుజాధిప మెందులకింత చిం
మనుజులు కోతులెంతటి సముద్రుడు వారధిదాట సాధ్యమ
జనపతి వార్ధినొంపగల శక్తి మె యుండిన యింతకా
మనమున నోర్చియున్న యనుమానము జెందగ నీకు జె

గీ॥ ఇప్పుడే మమ్ము బంపింపు మేశమీర
వారి వెగటార్తుమని మంత్రివరులు పల్క
వెడల యత్నించుచుండ విభీషణుండు
వినయమున నన్నతో నిట్లు విన్నవించె.

కం॥ శ్రీరాముడు భగవంతుడు
ఘోరున దైత్యులను బాహుబలముననే దుంచెన్
గౌరీశు ధనువు విరచెను
వీరల దుర్వాక్యములను వినవో కన్నా.

ఆ॥ వె॥ వానరుండొకండు వచ్చి పైద్యులగూల్చి
లంక గాల్చిపోయె బింకముగను
యిట్టివీరు లచట యెన్ని కోట్లున్నారొ
అరసి శాంతమొందు మగ్రజన్మ. 86

కం॥ అని యిటు పరి పరి విధముల
దనయన్నకు శాంతిగూర్ప దర్కింపంగా
ఘన కోపమ్మున నాతం
డనుజుండవు గావటంచు సంభ్రముల దన్నెన్. 87

ఆ॥ వె॥ మరల దన్నబోగ మంత్రి అడ్డమువచ్చి
శాంతపరచుచుండ సరియుగాక
నితని ముఖముజూడ నిప్పుడే మెడబట్టి
వెడలద్రోయుడనియె భీకరముగ. 88

గీ॥ అంతట విభీషణుండు ప్రశాంతమూర్తి
పాపము ఫలించు నేను జెప్పంగనేల
యనుచు దనతల్లి సన్నిధి కరిగి మ్రొక్కి
వివరముగజెప్పె జరిగిన విషయమంత, 89

కం॥ పదపడి శ్రీరామునికడ
కిదె వెళ్ళెద జనని యానతిమ్మని యనగన్
ముదమారగ దీవించుచు
విదిలించుగ నిట్లనెన్ విభీషణుతోడన్. 90

గీ॥ నాయనా నేను మున్ను నానాథులన
విన్నసంగతి యేమన విష్ణుడమర
రక్షకై ధాత్రి జనియించి రావణాది
దనుజులను జంపి నీ చిన్నతనయు నొకని
గాచి పట్టాభిషేకంబు గట్టుననియె. 91

కం॥ అని లక్ష్మణ సుగ్రీవుల
వనధికి జని సంప్రయుక్త పద్ధతి బలముఁ
గొనితెమ్మని పనిచిన వా
రనువుగ గొనితెచ్చి యివ్వ నభిషేకించెన్. 98

కం॥ పదపడి వననిధి దాటగ
నదనైన యుపాయమెద్దియన దైత్యుండుఁ
ఇది దాటనగునె యీవన
నిధి నే బ్రార్థింపవలయు నెమ్మది ననియెన్. 99

చ॥ ఇటుల దలంచుచుండ దనుజేశుడు వానరవీరు లెంతయుఁ
బటుతర శక్తిపంతులని భావనసేయుచు గణించి దూత న
చ్చటికి ప్రశాంతవాక్యముల సంధిగుదుర్పగ బంపనెంచి యు
ద్భట కలుషాత్ముడౌ శుకుని తద్దయు జేరగదీసి యిట్లనెన్. 100

గీ॥ ఇప్పుడు సుగ్రీవు సన్నిధికేగి నీవు
మీకు మాకును వైరంబు లేకయుండి
మానవుడు బుజ్జగించెడి మాటల కిటు
మాపయిన్ పోరవచ్చుట మంచిదగునె. 101

కం॥ అని నా దిగ్విజయంబుల
ననువుగ వినుపించి వానరావళి మగుడన్
జనునట్లు జేసిరమ్మని
పనిచిన నాతండు ప్లవగ పతికడజేరెన్. 102

గీ॥ చేరి సుగ్రీవునిన్ మోదమార బొగడి
మీకు మాకును వైరంబు లేకయుండి
మానవుడు బుజ్జగించెడి మాటలకిటు
మాపయిన్ పోరవచ్చుట మంచిదగునె. 103

కం॥ ఇదిగాక దనుజనాథుని
యెదిరించెడివాడుగలడె హీనుఁ డొకఁడై
మదమడచె సర్వసురులను
మది నాలోచించి నీవు మరలుము పురికిన్. 104

చ॥ అనవిని వానరాళి కడునాగ్రహ మొందుచు సద్గురాత్మునిన్
ఘనమగు ముష్టిఘాతముల కండలు వ్రయ్యగానర్చి మానకన్
గొనగొని ముక్కునున్ జెవులు గోయగ రాముఁడు మాతజంప రా
దని విడిపించి పంపఁడనె దానవమంత్రి విషాద చిత్తుఁడై. 105

ఆ॥వె॥ రామచంద్రుఁడంత రత్నాకరము చెంత
జేరి మంత్రయుక్త శిష్టనిరతి
దారి యిమ్మటంచు దర్భశయ్య నమర్చి
అధిపుడందు నిష్ఠ నధివసించె 106

కం॥ ఎంతయు బ్రార్థించిన నిసు
మంతయు నెడమీయకున్న నారసి యుగ్ర
ప్రాంతుండై యంబుధి జల
మంతయు నంకింతునంచు వస్త్రముబూనన్. 107

గీ॥ జడిసివచ్చి సముద్రుండు స్వామినీవు
కట్టుమిట సేతువు న్నేను కట్టుబడుదు
వస్త్రముపసంహరించు మటంచు బల్కె
శాంతమున వస్త్రమును మాన్చె జనవిభుండు. 108

కం॥ పవనిధి వారల గనుగొని
ఘనగిరులును వృక్షములును కడకేమైనన్
గొనితెచ్చి నలునిచేతనె
యనువుగ గట్టించు సేతుపని పచియించెన్. 109

గీ॥ బాల్యమున మౌనిసుతులను బట్టి జలధి
వేయుచుండంగ శాపము పట్టలేక
ఈనలునిచేత యేవస్తువైన జలధి
బడిన మునుగక తేలాడబడును గాక. 110

కం॥ అని మునులు బల్కినందున
మునుగక సేతువునగట్టు మునుకొని నలుడం
చను పెరుగునట్లు బల్కిన
విని యందరు జలధిగట్టు వెడలిరి పేర్మిన్. 111

గీ॥ అంత వానరులందరు నడవిలోని
గిరుల వృక్షములనుదెచ్చి సరభసమున
నలున కందివ్వ నిమ్మపండ్లట్లు చేత
నెగురవేయుచు బంధించె నెల్లగిరుల. 112

గీ॥ ఉద్ధతిని యిట్లు పదునాల్గు యోజనములు
తొలిదినముగట్టె మరునాడు సలలితముగ
నుదధి బంధించె రేబది యోజనములు
పట్టుదల నిట్లు సేతువున్ గట్టుచుండ. 113

గీ॥ రామచంద్రుడు సుగ్రీవ లక్ష్మణులును
సేతువునుజూడ నచటికి జేరినంత
ఉడుత యొక్కటి కడునార్ద్ర ముదధి మునిగి
యిసుక బొరలుచు సాయమై యొసగుచుండె. 114

చ॥ అదిగని రామచంద్రుడు దహాహాయని లక్ష్మణ దీనిజూచితే
సదమల భక్తితో మనకు సాయమొనర్పదలంచె చూడగా
నది ముదమాయెనంచు బహుమాన పురస్కృతి దానిబట్టి నె
మ్మది నిమరంగ గీతలుగ మానితరీతి నెసంగె మేనిపై 115

గీ॥ ఇట్లు వారలు సేతుప్ర నెలమి జూచి
మిగుల వానరవీరుల మెప్పుగొనగ
మొనసి మరునాడు పూర్తిగా ముగియజేసి
తేజరిల్లిరి విశ్రాంతి దీప్తిమెరయ. 116

గీ॥ కుసుమవర్షము దేవతల్ కురియజేసి
సేతుబంధన మెవరేని శిష్టరీతి
జూచినను, జెప్ప వినినను శుభములొంది
ఆయురారోగ్యములు గాంతురని నుడివిరి. 117

కం॥ శ్రీయుతమై యలరెడి రా
మాయణము చతుర్థభాగ మారూఢి నశన్
జాయని సద్భక్తిని సు
శ్రీయుత రాష్ట్రాటి ఓదిరెడ్డి రచించెన్. 118

కం. ఈ రామాయణకథ నె
వ్వారేనియు వినిన జదువ వ్రాసిన యేనిన్
శ్రీరాముకృపను సంపద
లారోగ్య శుభంబులులొంద నయ్యెడుగాకన్. 119

—(౦)—

## పంచమ భాగము

—)o(—

శ్రీలోలా! సద్ధర్మ వి
శాలా! కరుణాలవాల! సామజపాలా!
లీలాలోల! సుశీలా!
లాలితశుభ సుగుణజాల! రామనృపాలా! 1

అంచితముగ సేతువలర గట్టెడిదాక
నిల జతుర్ధభాగ మెలమిజేసి
అది మొదలుగాగ నటుమీద పంచమ
భాగమే నొనర్తు బరమనిష్ఠ. 2

ఈగతి సేతువు ముగియగ
సాగరు డధిపునకు వస్త్రజాలము లొసగెన్
వేగదలి సైన్యయుతముగ
రాఘవుడు సువేల భూధరమ్మున జేరెన్ 3

॥ అచట దండు విడసినంతట రావణు
డరసి మంత్రివరుల నాత్మహితుల
కొలువుకూటమునకు బిలిపించి కపిసేన
యునుపు దెలియవలయునని తలంచి 4

మహిత మాయాప్రభావులు మంత్రివర్యు
లైన శుకసారణుల వానరాళికడకు
వానరుల రూపమునబోయి వారిబలము
నంతయు నెరింగిరండని యానతిచ్చె. 5

కం॥ వారును రయమున సూక్ష్మాకృ
కారులుగా జలధిదాటి కపులై యెసపట్ల
జేర విభీషణు డిప్పుక
శ్రీరామునికడకు వారి జేర్చినవాడై.

గీ॥ రావణునిమంత్రులే వీరు రాజుపంపి
వానరులమాట్కి యిచటికివచ్చి ప్లవగ
సేనలన్నియు గనుగొని వెలియపట
చెప్పగా వచ్చియున్నారు చిత్తగింపు

కం॥ అని తెలియబల్క వారలు
ననఘ విభీషణుని పల్కులన్నియు నిజమే
మనుజేశ బ్రోవుమని పద
వనజములకు మ్రొక్కినంత ప్రభువిట్లనియెన్.

ఉ॥ దానవమంత్రులైన మనసు దప్పక యిప్పుడె జంపగాదగున్
గాని వధించి పొవలన గల్గెడి లాభమదేమి కావునన్
వానర వీరులంపుమని వారక నారసి పైత్యనాశనం
జేసని పోయిచెప్పుడన సద్గుణుజాప భయకంపితాత్ములై.

కం॥ అక్కడ జని దనుజాధిప
యెక్కడజూచినను వానరేంద్రుని బలముల్
మిక్కుటమై మనమెదికి
యొక్కుమ్మడి జైకొనంగ నున్నారనుచున్.

గీ॥ అచట దను పరిభవమాది యన్నిగతుల
సంగతులు చెల్ప నతడేమి సరకుగొనక
మేడపైనెక్కి వారల జూడదలచి
యరయుచుండె మంత్రులతోడ నచటజేరి.

కం॥ శుకసారణు లా రాముని
సకల బలంబులనుజూపి సర్వోద్ధతులన్
ప్రకటముగ దెల్పి జానకి
నికనైనను రఘువరులకు నిమ్మని యనగన్. 12

కం॥ కానీ నా బలమున కీ
వానరబలమెంత మనుజవర్యుం డెంతా
మానుడు మీ సంశయములు
నేనీ జానకిని విడువ నెన్నటికేనిన్. 13

మ॥ సురలన్ బారగదోలినాడ నమరేశున్ గట్టుదిట్టంబునన్
బరగంగా విధియించినాడ యముని‌న్ బంధించినాడన్ మహే
శ్వరు శైలంబు పెకల్చినాడను తపస్స్వాధ్యాయతన్ బ్రహ్మచే
వరముల్ బొందినవాడ నన్నెదుర నెవ్వండోపు జర్చింపగన్. 14

చ॥ అని యిటు మూర్ఖమూని దనుజాధిపుడయ్యెడ రాముశీర్ష మ
ట్లనువుగజేసి తీసికొని యా ధరణీసుత చెంతకేగి యో
వనజదళాక్షి చూడు రఘువర్యుని నే వధియించి శీర్షమున్
గొని యిటు దెచ్చినాడ నిదిగో యని ముందట వైచినంతటన్. 15

గీ॥ అది గనుంగొని జానకి హా యటంచు
వసుధపై వ్రాలి కొంతసేపటికి లేచి
ప్రాణనాయక నీకెట్టి పాటుగల్గు
నని మనంబున గనలెతి నక్కటకట. 16

కం॥ అని దుఃఖింపగ రావణు
డనువుగ బోధింపుడంచు నా దనుజస్త్రీ
లను హెచ్చరించి పోయిన
కనకరమున బల్కి రసురకామిను లిటులన్. 17

కం॥ అమ్మా యని శోకమూలము
నెమ్మనమున దీనిగాంచి నెగులొందుచు నా
ఖ్యానమ్మగ సురేశ్వరి ప్లవ
గమ్మంతో మన్నదాను కడకేగు వనమ్మున్ 18

ఆ॥వె॥ అనుమానాడు చెప్పునంతలో శీఘ్రము
మారుతాత్రి వదలి మాయమయ్యె
నచట వానరాళి యఖిలాట్టహాసముల్
చేయుశబ్ద మిచట వినబడియె 19

గీ॥ అంత బహిరాసమునుమాని యవనిజాత
నెమ్మనమ్మున పతిని ధ్యానించుచుండె
రామచంద్రుడు గిరిశిఖరమ్మునుండి
అల విభీషణుతో లంకనరయుచుండె 20

కం॥ ఈపగిది రాముడట లం
కాపుర వైభవము నెల్ల గనుగొనుచుండన్
ఏపున దనుజుని విభవము
దీపింపగ నెమ్మి వెలువడిన యంతన్. 21

గీ॥ అది గనుంగొని సుగ్రీవు డాగ్రహించి
దానవాధము దుర్మదాంధమున నిట్లు
వైభవము నాకు జూపగా వచ్చినావ
యని మహోద్ధతి జెలరేగి యతనిదాకె. 22

కం॥ ఓరీ రావణ యిపు నే
శ్రీరాముని భటుడ నిన్ను జీల్చెదనని దు
ర్వారగతి నెగసి నెత్తురు
గారగ మోమునను దన్నె గడు దర్పముగన్. 23

ఆ॥ వె॥ కనలి రావణుండు కపినాయకునిఁ జట్టి
విసరి వైచినంత వీరవరుఁడు
గగనవీథి కెగసి కపులార్వ రావణు
మకుటములను దన్నె మహిని వ్రాల. 24

కం॥ నినుఁ దోఁకఁ బట్టి సంద్రము
లను ముంచిన వాఁ డెవండు రావణ నేనా
తని తమ్ముఁడ సుగ్రీవుఁడ
కనుగొనుమిక నీకు నంత్యకాలం బయ్యెన్. 25

కం॥ అని ముష్టియుద్ధమొనరిం
పను బూనిన నొకరి నొకరు బహువిధములుగా
తనువులను రక్తధారలు
సెనయఁగ బోరాడి యెగసి యినజుఁడు వచ్చెన్. 26

ఉ॥ వచ్చిన వానరున్ గని సెబాసు బళీ వహవా యటంచు బల్
మెచ్చఁగ రామచంద్రుఁడును మిత్రకుమారుని గౌఁగలించి యో
సచ్చరితాత్మ రావణుని జంపక గాసి యొనర్చి ధీరతన్
వచ్చుట మేలు గల్గె మును బల్కిన నా వచనంబు చెల్లఁగన్. 27

గీ॥ అసురవరుఁ జంపి నీకు పట్టాభిషేక
మొనరఁ జేయుదునని విభీషణునితోడ
మాటయిచ్చితిగాన దుర్మదునిఁ జంప
నేనుగా కెవ్వరునుఁగాని పూనరాదు. 28

గీ॥ అనిపలికి లంకపై దాడి యరుగఁదలచి
కోట్లకొలఁది వానరసేనఁ గూడి రాము
మూర్తి యుత్తరద్వారంబు ముట్టడించె
దానవుల మానసంబులు తల్లడిల్ల. 29

ఆ॥ వె॥ అతులిత ప్రభావు లసమదికోటుల
వానరాళిగొల్వ నూనివచ్చి
పార్థివముగ పూర్వవాకిట నీలుండు
దండునిడిసె శత్రుదళము లదల. 30

ఆ॥ వె॥ అర్కజుండు ముప్పదారుకోట్లప్లవంగ
వరులుగొల్వ మరియు వాయుసుతుడు
బరగ విక్రమించి పడమటి వాకిట
దానవాళి యదల దండువిడసె 31

ఆ॥ వె॥ అంగదుండు వానరానీకములు గొల్వ
గజగవయ గవాక్ష ఘనులతోడ
నగరికపల దక్షిణ ద్వారమునవచ్చి
దండువిడిసె శత్రుదళము లదల. 32

ఆ॥ వె॥ ఇట్లు దండువిడిసి యినకులాధీశుండు
మొదట రాయబారముగ నొకండు
చనుట మేలటంచు జర్చించి పలిపించె
వరగుణాఢ్యుడైన వాలిసుతుని. 33

గీ॥ అంగదా నీవుబోయి దైత్యాధమునకు
మనదళంబునగల విక్రమంబు నెల్ల
దెలియగాబల్కి యచ్చటగల విధంబు
దెలిసికొని రమ్మటంచు విధించి పనిచె. 34

కం॥ అంతట నతడా దనుజుని
చెంతకు విక్రమమెలర్ప జేరిన దనుజుల్
మంతనములు బల్కుచు దన
చెంతకు బంధింపుడంచు జేరియనంతన్. 35

గీ॥ వారి వారించి రావణుం డోరి యిట్లు
వచ్చినా వెవ్వడవు నిన్ను బంపి రెవరు
వివరముగ దెల్పుమనగ నవ్వీరవరుడు
నేను రాముని బంటును దానవేంద్ర. 36

సీ॥ రాముడెవ్వండన రణశూరుడై యొప్పు
భృగురాము గెల్చిన విక్రముండు
భృగురాము డెవడన పృథులవిక్రము గార్త
వీర్యార్జునోర్చిన వీరవరుడు
అరయ నా కార్తవీర్యార్జునుల డెవడన
నిను జెరబెట్టిన ఘనబలుండు
నిను జంకనిరికించి నీట ముంచీడ్చిన
ఘనుడైన వాలి నా కన్నతండ్రి.

ఇన్ని జెప్పగ నేటికి నిన్న నిన్ను
గాటముగబోరి రక్తము గారునట్లు
లడచిపోయిన సుగ్రీవుడనెడి సర్వ
వీర వానరపతియె నాపిన్న తండ్రి. 37

గీ॥ అని యిటుల బల్క రావణు డాగ్రహించి
యోరి దుర్మద నాచెంతమీర యిట్లు
వదరుచున్నావు మున్నిట్లు వదరి లోక
గాల్చుకొనిపోయె నొకకోతి కనవె యనిన. 38

కం॥ కనకేమి హీనబలుడగు
హనుమంతుం డతని హాస్యమాడుచు జెంపల్
వనచరులు మోది విడిచిరి
యినజుని సైన్యమున నెక్కడెక్కడ వటంచున్. 39

ఆ॥ వె॥ అతని నన్ను నిట్టి యసదైన పనులకు
పంపుచుండ్రు హీనబలులటంచు
నేర్పుతోడ బనులు నెరవేర్పలేకున్న
పరిహసించి వెడల బంపుచుండ్రు 40

ఆ॥ వె॥ ఇప్పుడైన సీత నినకు లేకునకిచ్చి
శరణటన్నగాచు శాంతమూర్తి
కాక తక్కనేని కాకుస్థు బాణాగ్ని
దహనమగుట నిజము దనుజ కులము. 41

చ॥ అని యిటు బల్కినంత దనుజాధిపు డెంతయు నాగ్రహించి యీ
వనచరు బట్టికొట్టి పెనుప్రాణము దీయుడటంచు బల్కినన్
దనుజులు చుట్టుముట్టి ప్రాళ్ళు పీడించుచునుండ నాతడున్
ఘనమగు ముష్టిఘాతముల కండలు జీల్చి వధించె నందరిన్. 42

కం॥ పదపడి రావణు మకుటము
లదరగ జరణముల దన్నియటు వినువీధిన్
గుదుట గజని తన బలముల
మదమున గలిసితెల్చె ముసుగొని యంతన్. 43

గీ॥ ఇంతపనియైన దనుజుండు స్వాంతమందు
నరుకుగొనక మదమ్మునసే పలము బూని
మనుజవరుడెంత కపులెంత మాకటంచు
గర్వమున మించి కన్నులు గానకుండె. 44

నేనింత బలయుతుడనై
యీ నరునకు వెరువదగునె యిప్పుడద్ధతితో
మానిత వైభవ మురులకు
నే నుత్తర గోపురమున నెరుగం జేతున్. 45

॥ వె॥ ఆని సమస్త భూషణావళి ధరియించి
మహి ధగద్ధగాయమానముగను
సురఘటాళిగొల్వ నుత్తరగోపుర
మెక్కి నంతజూపె నిసకులుంసు. 46

॥ చూచి పవళించి మేయుండి చోద్యముగను
ధనువు పదిలునబట్టి యుద్దండవృత్తి
శరమువైచిన పదివేల శరములగుచు
ఛత్ర చామర భూషాళి జగతిగూల్చె. 47

॥వె॥ అందు వొకనికైన హానికల్గకయుండ
భూషణాళి గూలిపోవునట్లు
పండి లేవకుండ బాణంబువైచుట
జూచి దనుజబలంబు చోద్యమందె 48

॥ అచట సుగ్రీవు డంతరి నరసి యిపుడె
లంక ముట్టడి సేయవలయునటంచు
నాజ్ఞచేసిన కపు లట్టహాసమెసగ
పట్టణ ద్వారములు నాల్గు బట్టుకొనిరి. 49

॥ కడుబల్మి దనుజుల మెడకు తోకలుజుట్టి
దట్టించి వెసద్రిప్పి కొట్టువారు
తేకువమీరంగ మోకాల మోచేత
మూతులు విరుగంగ బొడుచువారు
ముష్టిఘాతముల బొమ్మలు వ్రయ్యలొనరించి
ధరగూల్చి కాళ్ళచే దన్నువారు
మొనసి చేతుల వృక్షములుబట్టి త్రిప్పుచు
దనుజులమోది యుపవల్చువారు

ఇటుల ప్లవగులు దనుజుల నేచుచుండ
ఏమిసేయంగ పోచక యింద్రజిత్తు
యాగమొనరించి ఘోర శస్త్రాస్త్రవితతి
పడసి మాఱ్కొనె నదలించి వానరులను. 50

కం॥ మాయాజాలము సేయుచు
నేయెడ గనుపింపకుండ నెంతయు బోరన్
ధీయుతులగు కపివరులకు
నాయెడ నేమియును దోచ కరయుచునుండన్. 51

ఆ॥వె॥ రామలక్ష్మణుల సురద్వేషి నాగాస్త్ర
వితతి మూర్ఛనొంచి పీటఁజేగ
వానిమాయ గనుక వచ్చివిభీషణు
చెంతజేరె ప్లవగ సేనవెల్ల 52

గీ॥ అంతట విభీషణుడు వాలంవరికిని
నీరుమంత్రించి చల్లిన నిమేషముననె
మాయదెరచెను వానరుల్ మహితశక్తి
దైత్యు నెదురింపనుండిరి దర్పమెసగ. 53

ఉ॥ రాముడు మూర్ఛదేలి యటులక్ష్మణుఁగని దుఃఖమగ్నుడై
యేమియు దిక్కుతోచకిల నెంతయు గుందుచునుండ నారదుం
డామహనీయు చెంతకు రయమ్మునవచ్చి నమస్కరించి యో
స్వామి! ఖగేశ్వరుం దలఁపు చయ్యన మూర్ఛదొలంగునంచనన్. 54

గీ॥ రామచంద్రుండు మదిని హర్షంబు జెంది
సత్వరమున గరుత్మంతు సంస్మరింప
మూర్ఛనుండియు లక్ష్మణమూర్తి తెలిసి
నిదురదేరిన కైవడి నిలచినంత 55

కం॥ అక్కడ రావణు డడిగని
చిక్కరుగద యెన్నివిధుల జేటులుగూర్పన్
రక్కసు లెందరొ మడిసిరి
అక్కటకట యెట్టులనుచు నాలోచింపెన్. 56

ఆ॥వె॥ కూర్మితమ్ముడైన కుంభకర్ణుని నేడు
నిద్రనుండిలేపి పగులదీర
కదనమునకుబంప గడతేర్చునంచరి
ననితలంచి దనుజులను పఠించె 57

ఆ॥వె॥ కడగివారు కుంభకర్ణుని బలవంత
ముగను జెవ్వల శూలములను గ్రుచ్చి
కడుపుమీద భద్రిగజముల ద్రొక్కింప
నిదురదేరి యతడు నీల్గిలేచి 58

గీ॥ ఆవలింపుచు వారలనరసి మీరు
నన్ను మేల్కొల్పినారు మాయన్న కిప్పు
డేమి కార్యముగల్గెనో యెరుగదెల్పు
డని వచించిన జెప్పిరి యాజ్ఞజేయ 59

ఆ॥వె॥ ఇటుల దెలియబల్కి యెనుబోతుమాంసంబు
లాదిగా నొసంగ నన్నిమెసవి
త్రేపి మీసములనుదీటుచు గర్జించి
అన్నకడకుబోయి అనియెనిట్లు 60

చ॥ కదన మొనర్పబూనుటకు కారణమేమి వచింపు మిప్పుడే
కదిసి యరాతివర్గముల ఖండనజేసెదంచుబల్క న
మ్మదమున సర్వసంగతులు మానకదెల్పిన కుంభకర్ణుడ
య్యది కడుమూర్ఖమైనపని యంచుమనమ్మునయెంచి యిట్లనెన్ 61

కం॥ అన్నా నిష్కారణముగ
నన్నాతినిదెచ్చి పోరన్యాయంబగునే
యెన్నగ రాముండెవడను
కొన్నాడవో లోకపాలకుండగుగాదే 62

కం॥ అని పల్కిన నాతండో
యనుజన్మా నాకుచెలియవై ననునిటువన్
మనసొప్పదు రణరంగ
మ్మున చావోబ్రతుకో ముఖ్యముగ దేలవలెన్. 63

ఉ॥ పిల్లతనాన నాటికిని పృథ్విని గూల్చుట యెంతబోక, మే
నల్లుని యోగసిద్ధి గనునప్పుడు ద్రుంచుట దుర్మదాంధుడై
చెల్లెలి ముక్కునుం జెవులు చెండుట వ్రతపుత్రినిజంపి పట్టణం
బల్లరిజేసి కాల్చుజయు నారసి యెట్లు సహింతు జెప్పుమా. 64

ఆ॥వె॥ అనుచు నిశ్చయముగ నాతడుబల్కిన
పరశుఖండివాల శరములాది
ఆయుధములబూని యతి రౌద్రమూర్తియై
యుద్ధమునకు బోవ సిద్ధమయ్యె. 65

గీ॥ వెడలి పదఘట్టనములచే బుడమియదర
మిగుల కోలాహలధ్వనుల్ మిన్నుముట్ట
గదిసివచ్చెడి యా కుంభకర్ణు నరసి
వనచరాళి విభీషణు వద్దజేరె. 66

కం॥ ఇది యేమి చోద్యమయ్యెడి
తుద మొదలెక్కడను మదికిదోచదు కడు దు
ర్మదమును పర్వతమట్టుల
కదనమునకు వచ్చెనెవడొ కనుగొనుమన్నా. 67

ఆ॥వె॥ వెరువబోకుడని విభీషణు డాతని
విషయమెల్ల నిట్లు వివరముగను
ఆ ప్లవంగులెల్ల నాశ్చర్యపడునట్లు
చెప్పగా బొడంగె నొప్పుమీర. 68

కం॥ పరమేష్ఠిగూర్చి యాతల
డరుదార దపంబుజేయ నజుడాతనిపై
గరుణించి కోరుమెయ్యది
వరమున నాకధికనిద్ర వాంఛితమనియెన్. 69

కం॥ ఇదియంత విష్ణుమాయయె
పదిలంబుగ వరమునితడు బడసిన యేనిన్
మదమున లోకము లడచును
గదమని భారతిని నోట గదియగజేసెన్. 70

ఆ॥వె॥ అని భయంబుదీర నంతయు వివరించి
వెరువబోకుడిప్పుడె వెడలుడంచు
సమరమునకుబంప సంసిద్ధులై వారు
తరులు గిరులుబట్టి తలపడంగ. 71

గీ॥ వారువైచెడి కొండలు వానహస్త
ముననె ద్రోయుచు వెనుగదయూనిపైన
లక్షలుగ వానరులు నేల వ్రాలినంత
గాంచి సుగ్రీవుడా కుంభకర్ణుదాకి. 72

గీ॥ ముష్టిఘాతం బెసగ వక్షమునకు బొడువ
రక్తసిక్తాంగుడై నేలవ్రాలి యతడు
కొంతవడి దెప్పరిల్లి సక్రోధుడగుచు
ఘనదమగుశూల మతనిపై వైచినంత. 73

కం॥ ఆ విక్రమపరుడగు సు
గ్రీవుడపుడు మూర్ఛనొంది క్షితిపై వ్రాలన్
తీవిని గపిపరు నెత్తుక
రావణునకు జూపదలచి రయమున బోవన్. 74

కం॥ మనఱేని నసురు డెత్తుక
చనుచున్నాడనుచు ప్లవగ సైన్యము లెల్లన్
దనుజునిపై జనబూనగ
హనుమంతు డిట్టులనియె సందరితోడన్ 75

ఉ॥ ఏమిభయంబులేదు ప్లవగేశుడు మూర్చిలియున్న వాడు బల్
నేమముతోడ నాదనుజునిన్ గికురించి యదల్చి నేర్పునన్
మోమునదన్ని రాగలడు పోవకుడంతకు మించెనేని యు
ద్దామబలంబునన్ సకలదానవులన్ వధియింతమంచనెన్ 76

ఆ॥వె॥ కుంభకర్ణుడిట్లు గొనిపోవుచుండంగ
మూర్ఛదేరి యతని ముక్కు గొఱికి
చెవులనూడ కొఱికి చెలరేగి యెగసిన
అసురుడొడిసిత్రిప్పి విసరివై చె 77

గీ॥ అంత లాఘవమునబైకి నర్కతనయు
డెగిరి శ్రీరామచంద్రుని యెదుటవ్రాలి
దనుజునకు ముక్కుచెవులును తరిగివేసి
మరలితినటంచు జెప్పి నమస్కరించె 78

ఆ॥వె॥ ఇట్టి వికృత రూపమెసగ నేనేగతి
నగరమునకు బోవనగునటంచు
నాజిసేయ భీకరాట్ట హాసముతోడ
వనచరాళిపైకి వచ్చెనంత 79

కం॥ వనచరులందరు నాతని
తనువునకెగ(బ్రాకి, మశక తండములటు వెం
డును సందువడక దట్టము
గను మూగిన కొంతబాధ గన్పడనయ్యెన్ 80

సీ॥ ముకురంధ్రములదూరి కకవికలగా గోళ్ళ
బరుకుచు బయటికి బారు వారు
మూతిమీసములను ముగ్గురు నల్వురు
నొగిబట్టి యుయ్యాల లూగువారు
గట్టిగా పెదబొబ్బపెట్టు దానవుగోట
మూరి గీరుచు బయల్దేరువారు
పట్టజూచినవాని పట్టుకు జిక్కక
గడుసూక్ష్మరూపులై విడలువారు

నివ్విధంబున వానరులేపుమీరి
దేహమంతట నొరసి బాధించుచుండ
కనలి విదలించి వారిని గదుముచుండ
రావణు డాగ్రహమునవచ్చె రణమొనర్ప 81

చ॥ ఒకరినిమించి యొక్కరు మహో(గ్రశరమ్ములు పూని వైచుచున్
సకలవిధంబులన్ భయద సంగరమున్ బొనరించుచుండి భా
నుకులపరేణ్యు డుగ్రమగు నూతనబాణము వైవగా మరు
న్నికరము మెచ్చ దానవుడు నీల్గెను దైత్యులు తల్లడిల్లగన్ 82

గీ॥ అంత హతశేష దానవులచట చెప్ప
రావణుడు తమ్ముడాయని (వ్రాలి మదికి
యేమితోచక మిగుల మోచించుచుండ
నీతులను జెప్పజూచిరి నియమపరులు 83

ఆ॥ వె॥ తల్లికైకసియును తరుణిమండోదరి
మాల్యవంతుడాది మహితమతులు
నీతులుగ్గడించి నెమ్మినాతని కెన్ని
విధుల బోధసేయ వినగబోడు 84

ఆ॥ వె॥ ఇంద్రజిత్తుపవ్వి యుందుకు చింతిల్ల
నేల నీకుతండ్రి నేనుగలుగ
సర్వశత్రువులను సంహార మొనరించి
నీకు ముదముగూర్తు ప్రాకటముగ 85

కం॥ అని తండ్రి యానతిం గొని
దనుజుల కోటానుకోట్లు దర్పమెలర్పన్
వెనుకొనిరాగ మహోద్ధతి
జనుదెంచెను శత్రువులను జంపెద ననుచున్ 86

ఉ॥ అంతట రామలక్ష్మణులు నాకపిసైన్యములార్చిపేర్చి దు
ర్దాంత పరాక్రమంబెసగ దార్కొని ఘోరరణంబొనర్ప నా
క్ష్మాంతయు వెక్కసేయుక మహీస్థలి కంపమునొంద భీకరా
క్రాంతిముగాగ మార్కొనియె రావణపుత్రుడు చండమూర్తియై 87

కం॥ పరిపరివిధములుగా వా
నరులును దానవులు మూడునాళ్ళగ బోరన్
మరి యింద్రజిత్తు కడు భీ
కరమగు బ్రహ్మాస్త్రమప్పుడు గైకొనివైచెన్ 88

గీ॥ రామలక్ష్మణులను వానరాళినెల్ల
మూర్ఛగూలిన సన్మంత్రియుక్తుడౌ వి
భీషణుడు హనుమంతుని బిలువనాత
డనిలజుం డెట్టులున్న వాడని వచించె. 89

కం॥ ఇదియేమి రామచంద్రుని
మదివలపక నెట్టుల హనుమంతుని యొకనిఁ
విదితముగ నడిగినా వే
మదియని తర్కించినపుడుగ నతడిట్లనియెఁ 90

కం॥ అతడుండిన కపులుందురు
అతడేలేకున్న బ్రతుకరందురు కపులున్
గుతకుత నరయు మనంగఁ
వెదకుచు హనుమంతుడటకు వినిమే వచ్చె 91

ఆ॥వె॥ అంత జాంబవంతు డాయాంజనేయుని
చేరదీసి నీవు శీఘ్రముగను
పోయి ద్రోణగిరిని పొలుపారు సంజీవ
కరణిదెమ్ము జీవకళలనరసి 92

కం॥ అని పనిచినంత గడునవు
మునజని యాగిరినితెచ్చి యుంచటు నిడగఁ
ఘనమైన యౌషధుల వా
సనలొంచగ లేచిరపుడు సైనికులెల్లఁ 93

ఆ॥వె॥ సర్వశత్రువులను సంహరించితినంచు
వచ్చి యింద్రజిత్తు మచ్చటలర
జనకునకుదెల్ప సంతోషమును బొంది
కౌగిలించె సుతుని గౌతుకమున 94

ఆ॥వె॥ తెల్లవారలేచి యెల్ల వానరులును
ధరణి తల్లడిల్ల దర్పముగను
సింహనాదములను చెలగి యార్చుచునుండ
సరసి రామయుండు సాత్మగుంది 95

ఆ॥వె॥ కుంభకర్ణు సుతులు కుంభనికుంభులు
అతుల శౌర్యధుర్యులటకు వచ్చి
తండ్రిపగనుదీర్ప దైత్యేశు పనుపున
వెడలి రాజసేయ విక్రమించి 96

గీ॥ దనుజకోటులతోగూడి దర్పమెసగ
వచ్చి తలపడినంతట వానరులట
దానవులకును ఘోరయుద్ధం బెలర్ప
లక్ష్మణుం డుగ్రమునవచ్చె రణమొనర్ప 97

ఆ॥వె॥ ద్వంద్వయుద్ధమునకు దలపడి మెంతయు
ఘోరముగనుబోరి క్రోధమెసగ
దానవద్వయమ్ము ధాత్రిగూలగజేసె
సర్వవానరాళి సంతసింప 98

ఉ॥ ఈవిధి నెందఱెందఱో మహీస్థలిగూలి నశించుచుండగా
రావణుడాగ్రహించి యసురప్రకరంబులుగొల్వ నాజికిన్
జేవదలిర్పగాజని విశేషవరాటుల గూల్చుచుండ నా
పావనమూర్తి రాఘవుడుపైకొనివచ్చి రణంబొనర్పగన్ 99

కం॥ హనుమంతుడు రాముని గని
దనుజుడు రథమందునుండ రాముడుధరపై
ననిసేయనేల యని భుజ
మున నెక్కించుకొని యుద్ధమును జేయించెన్. 100

ఆ॥వె॥ ఒకరిమించి యొక్క రుగ్రబాణములచే
శక్తిమీర బోరుసల్పుచుండ
నపుడు రాము డర్ధచంద్రబాణము వైచి
దనుజు రథము నశ్వతతి నడంచె 101

రావణున కస్త్రములులేక రథములేక
నిలచియుండగ రావణా నెలపు కేగి
తగిన రథబాణములుగొని తరలిరమ్మ
విగత శస్త్రాస్త్రి జంపను వెడలిపొమ్ము 102

అని పలికిన దనుజేశుడు
తన మనమున సిగ్గుజెంది తడయక పురికేన్
జని చింతించుచు నుండగ
గని తనయుం డింద్రజిత్తు కడురోషమునన్ 103

జనకా మారణహోమం
బునుజేసి సమస్తశాత్రవులనిదెధ్వంసం
బొనరింతునంచు బల్కుచు
మునుకొని యాగముజేయ బూనినయంతన్ 104

అదియంతయు వేగుంచే
విదితంబుగ నెరిగి యవ్విభీషణు డదియున్
గుదురుగ నెరవేర్చినచో
కదనమ్మున వానిగెల్వగా దరయంగన్ 105

యాగవిఘ్నమ్ము సేయగా నేగుడంచు
ఆంజనేయాది వీరుల నంపినంత
వారిగని మాయసీతను వాడుదెచ్చి
ఖండనమొనర్చి యగ్నిలో గాల్చుచుండె 106

అంతట వాయుసందనుకు హా యికనేగతి యేమిసేయనౌ
నెంతటి కార్యమయ్యె మన జేసిన కేమని విన్నవింతు ని
ట్లెంతటి ఘోరయుద్ధ మొనరించియు నేమిఫలంబు జానకీ
కాంతను స్వామికర్పణముగా నొనరింపగ జాలమైతిమే 107

కం॥ అని ఖిన్నవదను డై రా
ముని సన్నిధి కరిగి దుఃఖముల నెరిగింపన్
మనుజేశుడు హా సీతా
యని భావిస్త్రాల రావణానుజు డంతన్ 108

కం॥ స్వామీ రాక్షస మాయయిది
నేమున్నదే యెరిగినాడ నేమాత్రంబున్
నీమది చింతింపకు మని
యామారుతి నచటికంపె యాగము జెరుపన్ 109

గీ॥ విఘ్నములు లెక్కసేయక విక్రమమున
నింద్రజిత్తు హోమము సేయ నెంచిరాగ
లక్ష్మణుడు ద్వంద్వముగ ఘోరరణ మొనర్చి
దానవాధిప పుత్రుని ధాత్రిగూల్చె 110

కం॥ అంతట సులోచనయను తన
కాంతుని మరణంబు దెలియగా గడుదుఃఖ
స్వాంతమున నామహాత్ము
డెంతయుని సహగమనము సేయు తలపునన్

కం॥ మామా నే సహగమనము
నేమమ్మున జేయనెంచు నీసుతుతనువున్
భామకు నిప్పింపుము
స్వామిని నేకలసి పొందు చయ్యన ననగన్ 112

ఆ॥ వె॥ రావణాసురుండు రణరంగమున నున్న
తనయు తనువుదేర దనకుసాధ్య
పడ దటంచు పల్కె పడతి శ్రీరాముని
కడకు సాహసించి కదలిపోయె 113

కం॥ కడుభక్తి రామచంద్రుని
యడుగులకు నమస్కరించి యతిదుఃఖితయై
యడిగెను నాపతిదేహం
బిడు సహగమనంబొనర్తు నెలుత యటంచున్ 114

ఆ॥వె॥ అంత రామచంద్రు డాంజనేయుని పిల్చి
ఇంద్రజిత్తుదేహ మెందుగలదొ
వెతకి చూచి యతనినీటికి జేర్చెడు
నట్లొనర్చుమంచు ననిచినంత 115

ఆ॥వె॥ పతినిజేర్చ నాత్మపురుషుని తనువుతో
సహగమన మొనర్చె సచ్చరిత్ర
ఆమె సాహసమున కాశ్చర్య మొందిరి
అతల సాధ్వియంచు ననురులెల్ల 116

కం॥ ఆ రావణు డిదివిని కడ
సారి రణంబున సాహసంబున గడు
ర్వారగతి నార్భటించుచు
ధారుణి గంపింపవచ్చె దనుజులు గొలువన్ 117

చ॥ అదిగని లక్ష్మణుండు మదినాగ్రహముంగొని దానవాధిపున్
పదునగు నస్త్రశస్త్రముల వక్షముప్రముఖ్యలొనర్చి పేర్చినన్
మదమున రావణాసురుడు మంత్రయుతముగ శక్తిబాని నీ
విడె కడతేరినాడవని వేసిన మూర్ఛిలె లక్ష్మణుండిలన్ 118

శా॥ రాముండాగ్రహమొంది ఘోరముగ సంగ్రామంబు సంధిల్ల ను
ద్దామ ప్రాభవమొప్ప ధాత్రి యదరన్ దట్టించి క్రూరాత్ము ని
న్నేమాత్రంబును వీడనంచు గమవహ్నిజ్వాల జాజ్వల్యమౌ
భీమాస్త్రమ్ములు మంత్రయుక్తముగ నావేశమ్మునన్ వేయగన్

ఆ॥ వె॥ ఆశరసులఘాటి కసురుడోర్వగలేక
వెరచి పారిపోయి పురముజేరి
హితుల జెప్పు నీతులిప్పుడు మదిగాంచి
చింతచేయసాగె జేష్టలుడిగి 120

సీ॥ మారీచు డొసగెల్పు మాటలు వినవైతి
సలవిభీషణుపల్కు లరయవైతి
తాత సంబోధనల్ తలదాల్చ లేవైతి
తల్లిబోధలు వినవొల్లనైతి
కుంభకర్ణుని పలుకులకు నోర్చవైతి
సతిపల్కు లారయజాలనైతి
ఆప్తుల బుత్రుల సనుజుల గోల్పోయి
గతులేమిగనక దుఃఖితుడనైతి

ఎందుజూచిన పదివేలుమంది రాము
లెదుట గన్పించుచున్న వారేమి నాకు
దిక్కుతోచక నెంతయు స్రుక్కనయ్యె
గటకటా యెంతటి నికృష్ట కాలమయ్యె 121

గీ॥ ఇంక జీవించి యేమి సాధించువాడ
వెలగి పాతాళహోమంబు జేసియైన
రాముని వధింతు లేకున్న రాఘవునకు
నసువు లర్పింతునని నిశ్చయం బొనర్చె 122

కం॥ అక్కడ సోదరునింగని నీ
మిక్కిలి శోకించుచున్న మిహిరకులేశున్
అక్కపినాథుడుగని నీ
విక్కరణిన్ దుఃఖమొందనెందుకు స్వామి 123

కం॥ హనుమంతు డిచట నుండగ
మనలక్ష్మణమూర్తికొఱకు మనమున జింతన్
గొననేల యిపుడె బనిచెద
ఘనపర్వత మిటకుదెచ్చు గౌతుక మెసగన్ 124

కం॥ అని పనిచినంత హనుమంతు డపుడె యెగసి
చనుచుసుండగ రావణు పనుపున నొక
దానవుడు కాలనేమి యాదారియందు
మౌనియైయుండి యా వాయుసూను నిలచి 125

ఆ॥వె॥ అనఘ నీవుబోవు ఘనకార్యమున కిది
తగినదారియందు తప్పుజూపి
మకరిచేతజిక్కి మరణింప నితడంచు
తలచియుండె గపట తాపసుండు 126

కం॥ హనుమంతుడరిగి కొలనుఁ
గని జలముఁ ద్రావబోవగా మకరము గొ
బ్బునబట్టిమ్రింగ నుదరం
బును జీల్చుక బయలు వెడలి మొసలిని జంపెన్ 127

ఆ॥వె॥ మొసలినుండి యొక్కముగుద వెల్వడివచ్చి
పవనతనయుతోడ బలికెనిట్లు
నేను దేవకన్య మౌనిశాపమున
నిట్లు మొసలినైతి నింపుదక్క 128

కం॥ నీవలన శాపముడగెను
పావని నిన్నిటకు జేరబంపినయతడా
రావణుని బంటుగావున
నేవిధముననైన వాని నిలగూల్చుమనెన్ 129

గీ॥ శక్తిసత్వము శ్రీరామచంద్రు నెదుట
కదనమున సాటిగాదయ్యె గప్పకైన
వర్షము విజృంభముగ మించివచ్చునట్లు
రావణునిముంచె బాణవర్షంబువలన 136

చ॥ ధనువున గంటమ్రోగిన హతమ్మగు లక్షలరాక్షసులంద్రు రా
వణ రణము దహర్నిశలపారక యేడు దినంబులెంతయుఁ
గణగణగంటమ్రోగె ననగా మరణించిన దైత్యులెందరో
గణనయొనర్ప నక్కజముగాదె రఘూద్వహు శక్తిసారయన్ 137

కం॥ శిరములు తెగవేసినచో
మరిమరియని మొలచుచుండ మానవనాథుం
డరుదంది యవ్విభీషణు
నరసిన నతడిట్టులనియె నధిపతి తోడఁ. 138

గీ॥ అమృతకలశము నాభియం దమరియుండు
గాన యెన్నెన్ని సారులు కరశిరములు
కూల్చినను దానవేంద్రుండు కూలిపడడు
ఆయువంతయు నాభియందమరియుండు 139

కం॥ అని తెల్పిన శ్రీరాముడు
మునుకొని యాయమృత కలశమును తెగవేయుఁ
ఘనపర్వత మలగూలిన
యనువున రావణుడు గూలి యసువులు విడిచెన్ 140

ఉ॥ అంత విభీషణుండు తనయన్న గతించిన దుఃఖపూరిత
స్వాంతముతోడ నాతనికి శాస్త్రవిధిన్ పరలోక సత్క్రియల్
సాంతముగా నొనర్ప మనుజాధిపు డయ్యెడ నవ్విభీషణున్
జెంతకు జేరదీసి సుస్థిరపట్టము గట్టె నిమ్ముగన్ 141

గీ॥ ఇటుల పట్టాభిషేకము నెలమిఁజేసి
రమణి సీతను బిల్చుక రమ్మటంచు
నా విభీషణు బంచిన నతఁడు పోయి
వైభవమ్మున గొనితెచ్చె వనజముఖిని

ఉ॥ పెన్నిధిగన్న పేదగతి ప్రేమపలిర్వగ రామచంద్రుడా
యున్నులసున్నిమంగనిమ సారమణీమణి దీనచిత్తయై
కన్నుల బాష్పముల్ దొరల కాంతుని జూచి నమస్కరింప నా
విన్నదనంబుఁ గాంచి పృథివీపతి కూరిమిమీర యిట్లనెన్

కం॥ తరుణీమణి నీ మానస
మెఱిగియు లోకంబుకొఱకు నీటులమ్మునన్
బరికింపదలచితిని భా
స్కరవంశంబునకు వన్నెగలుగ ధరిత్రిన్

కం॥ అని పల్కిన వనితామణి
యనలము దరికొల్పఁజేసి యాత్మేశుని నె
మ్మనమున దలచి చితిన్ జొర
ననలము గడుచల్లనయ్యె నందరు జూడన్

ఆ॥ చీర మాయలేదు చెమటబుట్టగలేదు
పూలువాడలేదు పొలతిమేన
కళలు తగ్గలేదు కనులు మూయగలేదు
అంతసేపు మంటయందునున్న

గీ॥ దేవతలు వచ్చి జానకీదేవి పరమ
సాధ్వియనిపల్కి యెంతయు సన్నుతింప
జానకిని రామచంద్రుడు సాదరముగ
చేరదీసెను సంతోషచిత్తుఁడగుచు

ఆ॥వె॥ తనపురమున కేగదలచి శ్రీరాముండు
వానరులనుబిల్చి వారి వారి
పురవరంబులందును బొందని పల్కిన
వినయమెసగ నిట్టులనిరివారు 148

గీ॥ స్వామి మీపట్టణమును మీ జనములను స
హోదరుంజూడ గాంక్షించుచున్న మమ్ము
సరసి మీతోడ వచ్చునట్లానతిమ్ము
మాకనుచుపల్క స్వామి సమ్మతి వహించి 149

గీ॥ ఎంతమంది కూర్చుండిన యేమనూర్ల
మందికగుచోటు మిగులంగా నొందియుండు
నట్టి పుష్పక యానమ్మునందు నెక్కి
పోవుదమటంచు దెప్పించె బుష్పకంబు 150

గీ॥ ఇటుల పయనించి సేతువు నెలమిదాటి
రామచంద్రుని యెదుట నారావణుండు
నిరచినట్టుల గన్పింప నెగులుజెంది
బ్రాహ్మణ పిశాచమనియెంచి భావమందు 151

గీ॥ శివునిలింగ మిందుజేర్చి ప్రతిష్ఠించి
పాపఫలము నిపుడె బాపుకొందు
ననితలంచి వాయునందనుతో లింగ
మిటకుదెమ్ము కాశికేగి యనగ 152

కం॥ అతండప్పుడె కాశికి
చేతోమోదమున నేగి శివునపు భక్తిన్
చేతులు మోడ్చి స్మరింపగ
సీతాపతిదలచి తెచ్చె శివలింగమ్మున్ 153

గీ॥ ఇంతలోపల సుముహూర్తమింతి మించి
పోవుచుండగ చూచిన భూమిఘుండు
ఇసుకతో లింగమునుజేసి వెసప్రతిష్ఠ
జేయ హనుమంతు డటవచ్చి చింతనొంది 154

ఆ॥వె॥ దేవలింగముటకు దెమ్మని ననుబంపి
యిట్టి లిసుకలింగ మిలప్రతిష్ఠ
జేసినారు నేనుజేసిన తప్పేమి
అరయనిది యనర్థ మయ్యెనేమొ 155

కం॥ అని చింతించుచు బల్కగ
హనుమంతా వేళమీరినందున నేని
ట్లొనరించితి నీలింగ
మ్మును పెరుకుము మరల దానిబూన్చెద నిచట 156

ఆ॥వె॥ అనగ నాంజనేయు డతిమోదమున దాని
నూడపెరికినేయ నూనిమెంత
కష్టపడినగాని కదలనందున స్వామి
చరణములకువ్రాలి సంస్మరింప 157

ఆ॥వె॥ హనుమ నీవుదెచ్చినట్టి లింగము ముందు
భాగమున ప్రతిష్ఠసరగజేతు
సర్వజనులు దీని సందర్శనమ్మున
భూరిపుణ్యగతులు పొందగలరు 158

గీ॥ అని ప్రతిష్ఠించి హనుమంతు నాదరించి
ముందుగా నీవుపోయి యానందమెసగ
భరతునకు దెల్పుమనిచెప్పి పనిచినంత
వాయువేగముతో బోయె వాయుసుతుడు 159

కం॥ అక్కడ భరతుండగ్రజు
డెక్కడనున్నాడొ యిపటికింకను రాడే
దక్కట యేమాయనొ యని
సొక్కుచు నుండంగ వాయుసుతు డరుదెంచెన్. 160

ఆ॥వె॥ స్వామి రామచంద్ర భటుడను హనుమంతు
డనెడివాడ భక్తినధిపునాజ్ఞ
ముందు దెలుపఁగోరి ముదమున వచ్చితి
వచ్చుచున్నవారు వారలిటకు 161

కం॥ అని తెల్పిన గడుముదమున
హనుమంతుని గౌగిలించి యశ్రులుగురుచున్
జనతతి గదలగ భక్తిని
తనయన్నకు నెదురుగాగ దరలిన యంతన్. 162

ఆ॥వె॥ స్వామి కెదురుబోయి సాష్టాంగముగ నమ
స్కృతులొనర్చినంత జెలువుమీర
కుశలమరసి భక్తి గురునకు తల్లుల
కెరగి పయనమైరి పురము జేర 163

గీ॥ పట్టణము జేరినంతట వైభవముగ
సర్వజనులును సంతోష జలధిదేల
రామచంద్రుడు ధర్మాభిరాముడగుచు
చెలువుమీరగ బట్టాభిషిక్తుడయ్యె 164

చ॥ జనకజ యంకమందు ననుజన్ములు త్రేవల పాదసన్నిధిన్
అనిలజుడుం దివ్యకనకాంచిత రత్నమయాసనంబునన్
దినకర తేజమొప్పగను దేవతలెల్ల బరిస్తుతింపగా
ఘనముజెలంగ వైభవముగా రఘురాము డెసంగె నప్పటన్ 165

ఆ॥వె॥ వానరాది హితుల వారివారిండ్లకు
బంపి రామచంద్రు డింపుమీర
పదునొకండువేల వర్షంబులిల నేలె
భరతు యౌవరాజ్యభరితుజేసి 1

కం॥ అనియివ్విధి గ్రీష్మకక
ష్మున పందొమ్మిది శతాబ్దముల పెబ్బదియా
రున నీపంచమభాగ
మ్మును రాస్త్రాడొబిరెడ్డి మగ్నయం జేసెన్.   1

కం॥ ఈ రామాయణ కథ నె
వ్వారేనియు జదువ వినన వ్రాసిన మేనిన్
శ్రీరామకృప సంపద
లారోగ్య శుభంబు లొందనయ్యెడు గాకన్.   16

:— సంపూర్ణము :—



# అవ్వారి నారాయణ జీవిత సంగ్రహము

జన్మస్థలము:- నీలారెడ్డిపల్లె, కొర్రపాడు(P.O.) బుక్కరాయసముద్రము, అనంతపురం తాలూకా, అనంతపురం జిల్లా.

తల్లిదండ్రులు ;- అచ్చమ్మ, పెద్దరంగప్ప

జన్మదినము:- 1-7-1929 సం॥

విద్యాభ్యాసము :- ఇంటర్ వరకు, తెలుగు విద్వాన్

ఉద్యోగము :- తెలుగు పండితులు

అభిమానము :- రచనము - సాహిత్య పోషణము

రచనలు :- 1) అనంతపుర మండల తెలుగు రచయితలు, 3) అనంతపుర మండలేతర తెలుగు రచయితలు 3) పర్యాయపద నిఘంటువు 4) వ్యుత్పత్తికోశము 5\ అచ్చ తెనుగు నిఘంటువు- 6) బుక్కరాయ సముద్రము.

సన్మానములు :- రాయలసీమ కవుల సభ, అనంతపుర కేంద్ర గ్రంథాలయము, ధర్మవరము కళాజ్యోతి, చెన్నేకొత్తపల్లి ఉపాధ్యాయ సమితి - గార్లదిన్నె హైస్కూలు మొదలగు చోట్ల.

ప్రభుత్వ సన్మానములు :- 1978 మార్చిలో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు. 1978 సెప్టెంబరులో State Award, 1983 సెప్టెంబరులో State Award పొందుట.

హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్స్ జూబిలీ హాలులోను, ఇందిరా ఆడిటోరియంలోను ముఖ్యమంత్రిచే సన్మానము, విద్యామంత్రిచే బహుమతి ప్రదానము.